# కళాశ్రీ

## ప్రథమ భాగము






విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి.

# కళాశ్రీ

ప్రథమ భాగము






విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి.

33

కవులు దరిద్రులా? నిజమె కారణమా? ధనకాంక్షలేక య
శివకరమైన కావ్యరససిద్ధికి నిత్యము ప్రాఁకులాడుటఁ
భువిపయిఁ బొట్టకూటికిని బుట్టదు దానికి గేలియేల? స
త్కవిత మహత్తెఱింగిన జగంబున రాజులు పూజసేయరే?

3౪

హాలికుఁడవంచు నిన్ను హాస్యాస్పదముగ
మాటలాడిన మీ బావ బాటతప్పి
హాలికుని క్రింది హాలికుఁ డయ్యె నకట!
ఈశ్వరునిలీలఁ దెలియఁగా నెవరి తరము?

3౫

కలము హలము నొక్క కరమున నడిపింప
చలము బలము నీక సాధ్యమయ్యె
కలిమిలేము లొక్క కంటితోఁ జూచెడి
శాంతమూర్తుల కిది సహజమె కద!

3౬

అనఘా! నీ కైతకు నే
మనమున సంతోషమంది మాన్యుఁడ వనుచున్
వినయమున మ్రొక్కి సెలవుం
గొనిపోయెద నొండు కవిని గూరిచి వ్రాయన్.



గ్రంథకర్త

# విజ్ఞప్తి

కళాశ్రీ యను నీ చిన్నిగ్రంథ మొక ఖండకావ్య సంపుటి. కళాశ్రీయను శీర్షిక కనుటతోడనె లలితకళా విషయ ప్రదీపిక యను నర్థము స్ఫురించుట సత్యము. లలితకళ లనఁగా సంగీత, సాహిత్య, చిత్రలేఖన, శిల్పాదులు. మానవుని విజ్ఞాన నాగరకతాదులు సోదాహరణముగఁ బ్రదర్శింపఁబడుట కివియే దర్పణప్రాయములు; వేయేల? జీవగఱ్ఱలు. కళాశ్రీ యన నాంధ్రకళాశ్రీయని నా ప్రథమ నిర్వచనము. సనాతనకవుల జీవిత ముఖ్యఘట్టములను గూర్చిగాని, తత్కవిత్వమును గూర్చిగాని, ప్రధాన వైచిత్ర్యములను గూర్చిగాని, అభిప్రాయభేదములను గూర్చిగాని గద్యరూపమున రచించిన గ్రంథజాల మెంతేని ఆంధ్ర సాహిత్యలోకమున దృగ్గోచరమగుననుట నిర్వివాదాంశము. ఇది యేమిచిత్రమోకాని గద్యమునకంటెఁ బద్యమే హృద్యమగుట నా బాల్యంబుగ దానిమీఁదనే నాకు మక్కువెక్కువ. ఛందోబద్ధమై లయాన్వితమై రాగరంజిత మగుటనేమో యదియొక యవ్యక్త రసోచితానందాస్వాదమున కనువగు ఫణితి. అది సృష్టిమార్గమునఁ గష్టమో సుఖమో దేవుఁడెఱుఁగు! తానువలచినది రంభ, తానుమునిగినది గంగ కదా!

నేను మద్రాసు విశ్వవిద్యాలయమునందలి విద్వాన్ పరీక్ష చదువుచున్నప్పుడు పురాతన విద్వత్కవివరేణ్యుల చతుర్విధ కవితారీతులంగూర్చియు, బహుముఖ ప్రజ్ఞాన్విత జీవితములంగూర్చియుఁ బలురకములైన విమర్శనములఁ జదువవలసినయవసరముగలిగినది. అట్లు కొన్నిసంవత్సరములు సాహిత్యమున

౭

వీర స్వర్గమునుండి నీదు పితరుల్ వీక్షించుచుఀ నీ మనో
భీరుత్వమ్మును గాంచి సిగ్గుపడిరో వేమారు చింతించిరో
కారుణ్యంబును జూపుచుండిరొ జగత్కల్యాణ సంధాయివై
లేరా సోదర! నీ మనోజ్ఞల కలా లీలం బ్రదర్శింపఁగఀ.

(రాష్ట్రోదయ పూర్వరచన)

౮

ఆంధ్రరాష్ట్రోద్యమం బిట నవతరించి
ఒక్కమొగిఁ బ్రాఁకెరా దిగ్వి దిక్కులకును
మూఁడుకోట్లాంధ్రు లేకమై మొనసిరేని
స్వర్గఖండమె మనకుఁ జొప్పడదటయ్య.



పేర్వడ్డ ప్రాచీనాంధ్ర మహాకవుల, గాయకుల, శిల్పుల జీవిత విచిత్రాంశ విద్యుల్లతలు సముచితరీతి వర్ణించుట నా సంకల్పము. అది విస్తృతవిషయము కావున నీ ఖండకావ్య సంపుటిని ఖండ ఖండములుగాఁ బ్రకటింప నుద్దేశించితిని. అందిది ప్రథమఖండము. ఈ భాగము విద్యాసేవాధురీణ గుత్తి వేంకట సుబ్బయ్యగారికి నంకితమొసంగితి. వారికి నాకుఁ బరిచయము సుమా రిరువది యైదేండ్లనుండి. అది పరిచయ మనుటకంటె మైత్రియనుట సమంజసమని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఆయన తన్ను నమ్మినవారియెడఁగాని, తాను నమ్మినవారియెడఁ గాని యెట్లుప్రవర్తించుటయుక్తమో సునిశితముగ విమర్శించుకొని యట్లు వర్తింపఁగల నేర్పరి. గ్రామాధికారిగ విధి నిర్వహణమున జాగరూకతవహించి ప్రభుత్వము మెప్పు పొందిన సమర్థుఁడు. బాలభటోద్యమాది శిక్షలెఱింగిన యోజ్ఞ. సంఘసేవాభిలాషి, విద్వత్కవీంద్ర బృందమన్న నెక్కడలేని ప్రీతి. విద్యావిషయిక సహాయమునకు జంకుగొంకులేక ముందంజవేయు పరోపకారి. పెద్దలయెడ గౌరవము, సములయెడ సుహృద్భావము, పిన్నలయెడ వాత్సల్యముచూపు నెఱిఁగిన వివేకి. కళాభిమాని. ఈయన సతీమణి శేషమ్మ సద్గృహిణి. కుమారులు నాగేశ్వరరావు, వీరాస్వామి సత్పుత్రులు. ఒకరు గ్రామాధికారి మఱియొకరు ప్రభుత్వోద్యోగి. తలిదండ్రులయెడ వినయవిధేయతలు గలవారు. గురు జనభక్తియుఁ గలారలు. పుత్రిక నాగమాంబ.

సంఘసేవ, సేయుటలో. వేంకటసుబ్బయ్యగారికిఁ గులమత భేదమంతగా లేదనవచ్చును. విశ్వసించిన నాయకున కనుయాయిగానుండఁగల స్థిరసంకల్పి. విద్వత్సభలన్న నమితప్రీతి. అవి చుట్టుపక్కల నెక్కడ జగిగినను ముందుండువ్యక్తి. కావునఁ గొంతకాలమునుండి ఘన మనీషుల వాఙ్ముఖముల సాహితీ ర సా స్వా ద న చే యు ట చే దానిమహిమ నెఱింగి కృతి సంకితమ్ముగా గ్రహించుటొక పుణ్యమని తలంచియుండవచ్చు.

నాగేశ్వరరావు. వీరాస్వాము లిరువురు తండ్రిగారి తలంపెఱింగియుంట దానిందీర్పఁ గుతూహలంపడుచుఁ గొలది దినములక్రిందట నావిషయము నాతో ముచ్చటించిరి. నేను వారి మనోభిప్రాయము గుర్తించి కళాశ్రీ ప్రథమ భాగము ది 9-8-1963న విద్యాసేవాధురీణ గుత్తి వేంకటసుబ్బయ్యగారికి షార్ద్వితీయవర్ధంతి సభలో సంకితమిచ్చితి. దీనఁ దత్తనయులు నేము గృతార్థులమైతిమని భావించుచున్నవాఁడ.

గ్రంథకర్త.

# అంకితము



విద్య నశింపని ధనమను
హృద్యమ్మగు సూక్తి నీదు హృదయమునాటన్
విద్యావృద్ధికిఁ గడఁగితి
విద్యాసేవా ధురీణ! వినయాభరణా!

పావన వృత్తియన్ భావనతో నుపా
ధ్యాయుఁడుగా యశంబందితీవు
బాపయ్య యున్నతపాఠశాల కొకప్డు
కార్యదర్శిగఁ బేరుఁ గాంచితీవు
గాంధేయమార్గమే ఘనతరమని దేశ
కల్యాణసద్బోధ - కఱపితీవు
దేవాంగ విద్యానిధికి దీక్షవహియించి
గడ్డమున్ బెంచిన ఘనుఁడవీవు

సదయ! యువజన సంఘాఖ్య సంస్థకాది
కార్యదర్శిగ సత్కీర్తిఁ గంటి వీవు
ఈవు లేనట్టిసంస్థ లేదీ పురమున
సూరిజన సఖ్య! వేంకటసుబ్బయాఖ్య!

పండిత కవీంద్రులన్న సద్భావ పటిమ
గౌరవాదరములతోడఁ - గాంతు వీవు
నీకు నీవ సమానమ్ము నేర్పునందు
అమలగుణధామ! గుత్తివంశాబ్ధిసోమ!

జాలి గలాఁడ వచ్చు మొక జాడనపోవుదు మిత్రమేలు నీ
మేలుగఁజూతు వన్నియును - మేకొననొల్ల వసాధ్యమైనచో
వాలుగ మానమూ నెదవు - పావనసత్క్రియలందు ముందుగాఁ
గాలిడినిల్తు నిక బాగడఁగావశమానొకొ నాగయాత్మజా!

పూర్వజన్మసమార్జిత పుణ్యగరిమఁ
బెక్కు గౌరవపదవుల వెలసినట్టి
శుభకీర్తివి వేంకటసుబ్బయాఖ్య!
అంకితము కళాశ్రీ కృతి - నందుకొనుము.





శ్యామలాంబా తనూజ ! ప్రశాంత తేజ !
సాధుసేవా విహారి ! గ్రామాధికారి !
సజ్జనవరేణ్య ! శైవదీక్షాగ్రగణ్య !
సుగుణిగణవర్య ! వేంకట సుబ్బయార్య !

# కళాశ్రీ

## అంజలి

ఘనమైన వింధ్యాద్రి కనక కిరీటమై
యాలయంబులు రత్నజాలములయి
వన లతాదులు జరీ పట్టువస్త్రములయి
యల నదుల్ ముత్యాల హారములయి
తొలిదిక్కు సంద్రంపుఁ జెలియలికట్టయే
విమల మణుల పాద పీఠికయయి
నన్నపార్యుండును నన్నెచోడుండును
మహిమఁ జాటెడి వందిమాగధులయి

సార గోదావరీ పుణ్యసతి యొకదెస
మాన్య చారిత్రయౌ పెన్న మఱియొకదెస
వీచికా చామరంబులు వీచుచుండ
నలరు శ్రీ యాంధ్రమాత కే నంజలింతు. 1



# ఆ కాం క్ష

మేను మేలిమిచాయల మించియుండు
వాలుచూపులు తెలిదమ్మిపూలచాలు
నవ్వ నవరత్నములు రాలు నవ్యకళల
నందములకెల్ల రాణి మా యాంధ్రవాణి. 1

అన్యభాషా స్వరూప మావంత తెలిసి
మాతృభాషాప్రయోగ ధర్మమ్ముఁ గనక
కైత వ్రాయుటకై గజ్జె గట్టువాఁడు
వస్తుగుణ రుచులెఱుఁగని వంటవాఁడు. 2

ఆంధ్రోద్యాన విహారలబ్ధ సుమ సౌఖ్యాధీన చిత్తంబునన్
సాంద్రోత్సాహముతోడ నే పయనముల్ సాగించుచున్నాఁడ నా
కేంద్రస్థానము దివ్య భావ రస నిష్యందప్రభానంద ధీ
చంద్రోద్భూత సుధా తరంగ లహరీ సంకేతమౌ బ్రహ్మమౌ. 3



# భాషోత్పత్తి

ఒకరి భావము సైఁగచే నొకరెఱుంగఁ
గలిగి, వాగ్రూపమునఁ గొంతకాలమున్న
భాషకాది కనుంగొనఁ బాటుపడుట
కాక దంతపరీక్షకుఁ గడఁగినట్లు. 1

బ్రహ్మకల్ప సుధీవరుల్ - బహు తపించి
అక్షరమునకు నొకరీతి - నాకృతి నిడి
లిపి సృజించి, తద్వ్యాప్తికి నిపుణతమెయి
రాళ్ళఁ గొయ్యలఁ బత్రాల - వ్రాసి రపుడు. 2

తేనెవలె మధురమగుటఁ - దెనుఁగనియును
నల త్రిలింగ దేశజయౌట - తెలుఁగనియును
నాంధ్రులకు భాష యిదియౌట - నాంధ్రమనియుఁ
దెనుఁగుబాసకుఁ బేరులు - తేజరిల్లె. 3

విజయవాడను గమనించి వెదకినంత
యుద్ధమల్లుని శాసనం బొకటి దొఱకె
నందు మధ్యాక్కరలు గొన్ని యమరెఁ గాని
భాష సంస్కారరూపమ్ముఁ బడయలేదు. 4

తెలుఁగుభాష సీతాకోకచిలుక వోలె
వివిధ రూపమ్ములను బొంది వెలిసె నిట్లు
తిరిగి యేమేమి మార్పులు జరుగఁగలవొ
యెవ్వరూహింపఁ గలరది యీశ్వరేచ్ఛ. 5

అచ్చ తెనుఁగుపదమ్ముల నమరఁ జేయ
నష్టరసములఁ బుట్టింప ననువుపడును
దత్సమంబులు లేకున్నఁ దగినరీతి
వీర రసమును బొంగింప వీలులేదు. 6

గ్రీకు లాటినుపదము లింగ్లీషులోనఁ
గలిసియుండుట నది యొక ఘనతఁ గాంచె
సంస్కృత పదమ్ములెన్ని తత్సమము లగుచుఁ
దెలుఁగునంజేర నిది యొక కళనుబొందె. 7

తెలుఁగు కన్నడబాసలు కలసి మెలసి
సంస్కృతాన్విత శోభా వి - శాలములయి
తొల్లి పెరిగెను బ్రియమైన - తల్లిచెంతఁ
గులుకుచుండెడి కవల పిల్లలనుబోలి. 8

కబ్బపుం గన్నె లోకమ్ము గనకమున్నె
వృత్తములు శాసనంబుల వెలయుచుండ
నచ్చటచ్చటఁ గొన్ని పద్యములు దొఱకె
బీజమాత్రమ్ము లవి కావ్యభూజములకు. 9



తెనుఁగుఁ గైతకు బ్రహ్మ - మన పెద్దనార్యుఁడే
యనినంతఁ దిక్కన - యదరిపడియె
తిక్కన కా పల్కుదక్కె మున్నే యన్న
నెఱిఁగి నన్నయ్య కన్నెఱ్ఱజేసె
నాదికవి యనుమాట - యమరె నన్నయ కన్న
నన్నెచోడుని మది - చిన్నవోయె
నన్నెచోడుని గూర్చి - తిన్నఁగా గమనింపఁ
జాళుక్యుల మనంబు - జల్లుమనియె
నిట్టి సందిగ్ధమును దేల్చ - నెట్టులనినఁ
బలుపెనలనుండి గుస గుసల్ - బయలు వెడలెఁ
గావున ననాది వాఙ్మయ - క్రమముఁదెలిసి
కోవిదులు తారె యోచించుకొనుట లెస్స.

# వీ ర గే య ము

## (Marching Song)

విజయ భేరి మ్రోగెరా
ధ్వజము నెత్తి సాగరా
మాతృదేశ సేవచేయ - మధురగీతి పాడరా॥ విజ॥

ఝూన్సి కత్తి మెఱపురా
మనకు మేలు కొలుపురా
వీర భారతావతరణ - వీరుఁడవై నిలువురా॥ విజ॥

ఆంధ్రతేజ మదిగొరా
అసుర మారణాంబరా
అతివ రుద్రమాంబరా - అరుల చించి చెండెరా॥ విజ॥

కృష్ణరాయ దీక్షరా
రాజ్య రమా రక్షరా
ఛత్రపతి శివాజి వాజి తేజము పరికింపరా॥ విజ॥

బాలచంద్రుఁ దలఁపరా
ప్రతిన ప్రతిభ నిలుపరా
బెబ్బులి లగు బొబ్బిలినృప శౌర్యమహిమ నెంచుమురా॥ విజ॥

మహిత తంత్ర పరుఁడురా
మంత్రి యుగంధరుఁడురా
త్రిప్పె రాష్ట్రచక్రమురా అప్పాజీ సచివుఁడురా॥ విజ॥

గాంధి నెహ్రు మాటరా
కనుము రాచ బాటరా
జనుల సేవ సేయరా - జన్మ సార్థకంబురా॥ విజ॥

అడ్డులేని ధాటిరా
విశాలాంధ్ర కోటరా
రెడ్డిరాజ బలమదిరా - దొడ్డ యుక్కు కవచమురా॥ విజ॥

తెలుఁగు వెలుఁగు హెచ్చెరా
తెలుఁగు నేత వచ్చెరా
కళకళలాడెడు భారత - ఘనత నీకు నచ్చెరా॥ విజ॥

తెలుఁగుతోఁట పూచెరా
తెలుఁగుచెట్టు కాచెరా
తెలుఁగుఫలము లందుకొనఁగ - ధీరత చే చాపరా॥ విజ॥



# ఆంధ్ర దీప్తులు

౧

కాకతీయాంధ్ర విక్రమ మెసంగిన కోట
బురుజు లింకను గూలిపోవ లేదు
చోళ రాజన్య యశోదీప్తులొలుకు దే
వాల యాఖండమ్ము లాఱలేదు
పల్లవాన్వయ పరిపాలన భండార
భాగ్య మెల్లెడఁ గచ్చు పాయలేదు
బొబ్బిలి వీర విస్ఫూర్జిత గాథార్థ
తాత్పర్యమున మోజు తగ్గలేదు
తెలుఁగు జాతీయ విజ్ఞాన మలవరించు
రాయల కళా విభూతి కన్మాయలేదు
బ్రతికి చెడిన మహాంధ్ర వైభవ భవమ్ము
తలఁచుకొనవోయి ! మేనెల్లఁ బులకరించు.

౨

తొలి నీయాంధ్రమహస్సుకా నొకపు డా తూర్పిండియాదీపులన్
వెలిఁగెన్ దన్మహనీయ శిల్పకళ లంచే నాఁటికిన్ నేఁటికిన్
నిలిచెం గాని తదీయ చిహ్నములు కన్నీ రోడ్చుచుం బెల్లువా
రల ప్రత్యేకత చాట నేమిఫల మార్యా, ఆత్మ లేకున్నచో.

3

అక్కటా! యాప్రదేశమం దాంధ్రులిపుడు
పొట్ట చేఁ బట్టుకొని వలపోయుచుంద్రు
తాము మును పూవులమ్మిన తావులందు
ఇమ్ము చెడి కిమ్మనక కట్టె లమ్ముకొలసె.

४

రెడ్డిరాజ్యశ్రీ రణక్రీడా సముత్పన్న
విజయభానుని దీప్తి వెలిఁగి వెలిఁగి
బ్రహ్మన్న వైష్ణవ. పరతత్త్వ సిద్ధాంత
భావ మేఘమ్ములు ప్రబలి ప్రబలి
బాలుని ఖడ్గధా రా లవోన్మేషముల్
మెఱపు లొక్కుమ్మడి మెఱసి మెఱసి
ఒంగవోల్ చినరాజు సంగరాంగణమున
శరవర్ష మాపోవఁ గురిసి కురిసి

సిద్ధ నాగార్జునాచార్యు సృష్టి కతన
అమర విజ్ఞాన చంద్రోదయమ్ము గలిగి
తన యశోదీప్తి నజ్ఞాన తమ మణంచి
మంతుకెక్కెను గుంటూరు మండలమ్ము.

౫

ఒఱ కత్తిదూసిన - మెఱపులు మెఱవవే
నవ్విన ముత్యాలు - నివ్వటిలవె
మాటాడ వాగ్దేవి - మీటదే వీణను
హస్తమెత్తిన బలి - యణఁగిపోడె
మౌనముద్రి వహింప - మహిమ సేవింపదే
కన్ను తెఱచిన ముక్కంటి యనరె
నిలిచినచోటు భూతలము స్వర్గము కాదె
కలము పట్టిన రసం - బులికి పడదె

ఆంధ్ర వీరవతంసమా! ఆత్మశక్తి
మఱచియుంటివ యిఁకనైన కఱకుతేలి
తెలుఁగు విజయపతాకను దివ్యదీప్తి
నెగురవేయుము నీ కీర్తి - జగము పాక.

౬

స్థిరముగఁ బ్రశాంతిఁ గోరెడి - దేశ మెపుడు
సిద్ధపడియుండఁదగు ఘోర - యుద్ధమునకు
పంటపొలమును రక్షింపఁ - బఱిక మంచె
దండ మొడిసెల కాఁపున కుండవలయు.

౭

వీర స్వర్గమునుండి నీదు పితరుల్ వీక్షించుచున్ నీ మనో
భీరుత్వమ్మును గాంచి సిగ్గుపడిరో వేమాఱు చింతించిరో
కారుణ్యంబును జూపుచుండిరొ జగత్కల్యాణ సంధాయివై
తేరా సోదర! నీ మనోజ్జ్వల కలా లీలం బ్రదర్శింపఁగన్.

(రాష్ట్రోదయ పూర్వరచన)

౮

ఆంధ్రరాష్ట్రోద్యమం బిట నవతరించి
ఒక్క మొగిఁ బ్రాఁకెరా దిగ్వి దిక్కులకును
మూఁడుకోట్లాంధ్ర లోకమై మొనసిరేని
స్వర్గఖండమె మనకుఁ జొప్పడదటయ్య.



ఆదికవి

# నన్నయ

౧

వేద వేదాంత సద్విద్యా వివేకాత్త
గుణమణి గణ రామ కోనసీమ
నట నటీ గాయక నానా కళోపాస
నా నవ్యసుఖధామ కోనసీమ
యాగ యోగ విరాగ భోగ రాగ త్యాగ
మానిత జనధామ కోనసీమ
చాళుక్యరాజ్య రాజస్థాన పోషిత
కోవిద కవిసీమ కోనసీమ
నారికేళామ్ర పూగ పున్నాగ లికుచ
పనస కదళీ కపిత్థ కాంచన శిరీష
మల్లికాది లతా భూజ మహిత జాత
కుసుమ ఫల భరితా రామ కోనసీమ.

౨

అదిగో! యావులమంద స్వీయ గృహవాంఛానంద సంవర్ధమౌ
పొదుగుం జేపుల మందయానమునఁబోవుం బోల్కి గోదావరీ
నది రత్నాకరుఁ జేరుచున్నయది యీ నా తల్లియే నన్నయ
హృదయానంద పయః ప్రదానమునఁ బోషించెఁ సదా కీర్తికై.

3

రాజమహేంద్రవరంబున
రాజులకును రాజు రాజరాజనరేంద్రుం
డోజం బాలన సేయుచుఁ
బూజసలిపె నాదికవిని బుణ్యము పండన్.

౪

గోష్పాదమంతియ - కొమరొప్ప కేశముల్
నన్నని ముడిచేత - జాలువాఱ
భస్మ రేఖలపైని - బరగు కుంకుమబొట్టు
హరుని మూడవనేత్రమన వెలుంగ
మకరకుండల దివ్య - మాణిక్య కాంతులు
గండభాగంబున నిండుకొనఁగ
నంచున బట్టు పూలమరిన నవశాటి
యుత్తరీయంబుగా నొప్పుమీర

ధవళ యజ్ఞోపవీతముఁ దగ ధరించి
తాళపత్రాల కట్ట హస్తమునఁ దాల్చి
వేదమంత్ర రహస్యార్థ విదుఁడవైన
నన్నయా! నిన్ను జేజేల సన్నుతింతు.

౫

కవితా కన్యను కావ్య మార్గమునఁ జక్కందిద్ది గ్రామ్యాదులౌ
సవరింపంగల శబ్ద శాసనము విశ్వస్థాయిగాఁ గూర్చు నీ
యవతారంబును బ్రహ్మగాఁ దలఁచుచే యత్యంత సార్థంబుగాఁ
గవివర్యుల్దలపోయుచుండెదరు నిక్కం బాంధ్రితేజోనిధీ!

౬

ఆగకు విడుఁడవు కవితా
భోగవతిని సంస్కరించి పొందిన నీ యీ
వాగనుశాసన బిరుదము
నీ గణ్యత కొక్క సాక్షి - నిజము కవీంద్రా!

౭

నీ సనాతన ధర్మంబు - నీదు కైత
కూఁతునకు జక్కఁగానేర్పి - కొంటివయ్యొ
యావు నడిచేనిలో మేయ - నావుదూడ
గట్టునమ్మేయు టెన్నఁడుం - గలుగునొక్క?

౮

ఈవె మన తెన్గుకైత సృజించితంచు
మురియఁ జెల్లదు నీకన్న మున్న యద్ది
యుండె నొకకొంత యట్లుకా కొక్కసారి
కావ్యరూపాన వెలువడఁగలదె చెపుమ!

౯

బాలికపుట్టి యంత చనుఁబాలకు నట్టిటు పార్లి యాపయిన్
నేలను బ్రాఁకులాడుటను నేర్చి పదంపడి కూరుచుండి మై
వాలుగ లేచి, నిల్వఁబడి బాగుగఁ బర్విడురీతి భాషయుం
జాలగ మార్పులం బడసి సక్రమపద్ధతి నొందె నేఁటికిన్.

౧౦

నీ సము లెవ్వరయ్య కడు - నేర్పరి వీవ "పురోభివృద్ధికై
వాసిగ నాంధ్రభారతము - వైదికమంత్రి మతైక దృష్టితో
వ్రాసి జగమ్ముఁబ్రోచిన కృ - పామయుఁడీ కవిచంద్రుఁ" డంచు నీ
చేసిన చేఁతలం గడుఁ బ్ర - సిద్ధిగ వాకొనుచుందు రెప్పుడున్.

౧౧

భారతము తెల్గుసేయుట - పాపమనుచు
నాఁడు కొందఱు బెదరించి - నారు నిన్ను
నంతమాత్రాన నాపక - యట్టి పనిని
సర్వజన సేవ్యముగఁ జేయఁ - జాలితీవు.

౧౨

కవితయనఁ గత్తివంటిది - కాన నరయఁ
జంపఁగలదది మఱి బ్రతి - కింపఁ గలదు
మనుజులను దేవతలుగాగ - మార్పఁగలదు
చెలఁగి రాక్షసులుగనైనఁ - జేయఁగలదు.

౧౩

కాన బాలునిచేతి ఖ - డ్గంబువోలె
హానిసేయును దెలియని - వాని కద్ది
కావ్యమునఁ దొంగిచూచెడి - కవి హృదయముఁ
దెలియలేకున్న సత్యంబు - దెలియలేఁడు.

౧౪

మన పురాణములందు న - మానుషంబు
లతిశయోక్తులు కలవెన్ని - యద్భుతముగ
నైన నివి సర్వమతముల - నమరియుంట
వదలుచుంటి విమర్శక - వరుల కిపుడు.

౧౫

మంచి కథలోనఁ జెట్టి చొ - ప్పించియున్నఁ
దగఁ దెలియవచ్చు జ్ఞాన నే - త్రంబుచేత
గంధకం బినుపపొడియుఁ - గలసిన విడ
దీయవచ్చును సూదంటు - రాయికలిమి.

౧౬

ధీర! నీ వ్రాఁతలో నెన్నఁ - దెలుఁగుపదము
లొప్పియుండును నాల్గులో - నొక్కవంతు
సంస్కృతాభ్యాస వశమున - సహజమిదియ
కాక తద్భాషయందలి - గౌరవంబ.

౧౭

అక్షర రమ్యత రచనం
బ్రకీణతనొంద కెందుఁ - బ్రత్యక్షమగుఁ
నిక్షేప ముపాఖ్యానము
దక్షుఁడవు కథా కథనవిధానమునందుఁ.

౧౮

ద్రాక్షా పాకము భాషా
స్వక్షేత్రము దేశకాల - పాత్రౌఘ కళా
నిక్షేపము రక్షాగుణ
దక్షము భారతము సర్వ - ధర్మాన్వితముఁ.

౧౯

భాగవతశైలి లయకు సం - బంధముగను
జదువుటకుఁ జాల హాయిగా - సాగుచుండు
భారతపుశైలి యది యొక - పద్ధతిగను
విఱుగుచుండును నుఱుములు - మెఱపులట్లు.

౨౦

అల యథర్వణు భారత - మగ్గిపాలు
చేసితీవను దుష్కీర్తిఁ - జెంది తకట
యిద్ది నిజ మెంతవఱకొ స - ర్వేశుఁడెఱుఁగు
నైష్ఠికాచారధుర్య! యో - నన్నపార్య!

౨౧

ఆ కవి నట్లుచేసిన మ - హాఘమెయుండఁగ గోరుచుట్టుపై
రోకటిపోటుచందమున - రూఢిగ వేములవాడ భీముఁడున్
నీకొక శాపమిచ్చెనట - నీ వొనరించిన గ్రంథ నాశమున్
వాకొని, యిట్లు సేయఁదగ - వా? పగవారలకైన సత్కవీ!

౨౨

"హెచ్చగు నాదు కీర్తిని స - హింపక కొందఱు మందబుద్ధులై
నచ్చని నిందలన్నియును - నాతలరుద్దిరి యద్ది యెద్దియున్
మచ్చరితంబు కా" ఁడనెదె? - మచ్చసుమీ యిది జీవితంబులో
వచ్చినమాట చచ్చినను - బాయునె యెవ్వరికేని ధారుణిన్.

౨3

బిచ్చగానికి మఱియొక - బిచ్చగాఁడు
రాజవరునకు నింకొక - రాజవరుఁడు
పండితున కెన్న వేఱొక - పండితుండు
సహజ శత్రువులనుమాట - సత్యమగున?

౨౪

బాల్యమిత్రుండు సహపాఠి భారతమునఁ
బార్థునకుఁ గృష్ణువలె నీదు - భారతమున
సాయపటి నిత్యమౌ నీ ప్ర - శస్తిఁగన్న
అమలచరితుండు నారాయణాఖ్యుఁడెన్న.

౨౫

ఒక పద్యమ్మును వెచ్చపెట్టి సుకవీ! యుత్సాహ సంపత్తిమై
యకలంకమ్ముగఁ ద ద్యశస్సునకు బ్రహ్మాయుష్యముం గూర్చితే
సకలాంధ్రావని నీ కృకజ్ఞతను నీ సత్య క్రియాసక్తులం
బ్రకటాత్మీయ సుహృద్దయామతిని సంభావించుటల్ చిత్రమే.

౨౬

మూర్తి త్రయాత్మకమ్ముగ
వర్తించిన నీదు ప్రథమపద్యమె ధీరుల్
గుర్తించి యాత్మ విద్వర!
కీర్తించుట యబ్బురమ్మె కేవల భక్తిన్.

౨౭

ఆంధ్ర శబ్దచింతామణి - యనెడి పుస్త
కమును బాలసరస్వతి - ఘనత మెఱయ
వ్రాసి నీపేరనే వ్యాప్తి - చేసె ననుచుఁ
బలుకుదురు కొంద రదియెంత - వఱకు నిజమొ.

౨౮

నీ యనంతర కవులచే - వ్రాయఁబడిన
నవ్య శబ్దప్రయోగముల్ - భవ్యముగను
సాధువులఁజేయు సూత్రముల్ - సరిగ దాని
యందు నుండుటచే నట్టు - లనిరి సుకవి.

౨౯

భాషపుట్టిన తరువాత - వ్యాకరణము
పుట్టినది యని పల్కిరి - బుధులు కాన,
కావ్య శబ్దప్రయోగముల్ - గనిన పిదప
సూత్రములు చేసిరనుటయుఁ - జోద్యమగునె?

౩౦

నన్నయా! నీకుఁ బూర్వుఁడు - నన్నెచోడ
మానవేంద్రుఁడు కలఁడంచు - మానవల్లి
రామకృష్ణ కవీశుఁడు - వ్రాసె, పిదపఁ
బెక్కు పరిశోధనంబులు - పిక్కటిల్లె.

౩౧

వేంకటకృష్ణా రెడ్డియుఁ
గొంకక సువిమర్శనమ్ము - గొప్పగఁజేసెన్
శంకలు దొలఁగఁగ నిద్దఱ
లంకించెను నేకకాల - లక్ష్యమ్మునకున్.

౩౨

ఇంచుమించుగ నిరువురు - నేకకాల
మందె జీవించియుంటిరి - యైన నీదు
గ్రంథమే ముందు కీర్తిని - గాంచెఁ గాన
ఆదికవి యను ప్రఖ్యాతి - నందితీవ.

### కవిరాజ శిఖామణి

# నన్నెచోడుఁడు

౧

అదె కావేరీనది - యట
మృదు మధుర వచోవిలాస - మెసక మెసఁగఁగాఁ
బదుగురతో భాషించెడి
సదయ హృదయుఁడెవఁడో మోము, సంతసమొలుకున్.

౨

తేజిత ఖడ్గకోశ మణి దీప్తులు రత్నకిరీట కాంతు ల
వ్యాజ కళానురాగరతి - నైక్యతనొంద లసద్విభూతితో
రాజిలుచున్నవాఁడు రతిరాజువలెన్ నవమోహనాంగుఁడై
రాజగు నన్నెచోడకవిరాజశిఖామణిగాక యన్యుఁడే?

3

ఒరయూరు రాజధానిగఁ
బరిపాలనఁ జేయునట్టి - పావని యితఁడే
సరస కవిత్వాలోకన
పరమహిమన్ మాటలాడవలయు నితనితో.

౪

భవ బంధవిమోచనకర
భవ లీలాలోల ధీ ప్రబంధరచన యం
దవలీలఁ గేళి సల్పెడి
కవిరాజుకు రాజకవికిఁ గైమోడ్చెద నే.

౫

రాజు కళావిలాసమున రంజిలి తానొక పక్షపాతియై
రా జిల లేఁడటంచు సురరాజును గన్నులువేయి విప్పి యో
రాజ! కళావిలాస మను గ్రంథ సుమోత్తమ దాతవై సదా
భ్రాజిలఁగాంచి మెచ్చె కవిరాజు విరాజిలుటెన్న నబ్రమే?

౬

శ్రేయోమార్గ విలాసి నీదు సువచశ్శ్రీ పూర్వపుణ్యంబునన్
స్థాయింజెందఁ దెనుంగు ప్రౌఢ రసవ-త్సారస్వతంబయ్యెఁ ద
త్కాయంబన్ కవితాసరోవర మిలం గర్ణాటభాషా పద
శ్రీయోగంబను నూత్న కంకణములన్ సిద్ధించుటల్ చిత్రమే!

౭

అన్నిన, లగ్గనోసి మొదలైన పదంబులు నీదు గ్రంథమం
దున్నవి కన్నడంబు లవి - యొప్పెను గ్రామ్యము లేమికారణం
బన్నను ముందె చెప్పితిగదా తొలి సఖ్యము దాన కావ్య మా
వన్నె దొఱంగ దైన సహవాసపు దోసము రిత్తవోవునే?

౮

తళియ, మలరుల, ముడి, నాయి - కుళిరు, వేల.
అరయఁ దన్నీరు, పాయి మొదలైన కొన్ని
తమిళభాషా పదంబులు నమరియుంట
కేమి కారణమో నిర్ణయింపలేము.

౯

ఒకటి రెండని యెంచకుమో కవీంద్ర!
ఎయిద నేరమి, నెచ్చెలి, యెల్లిదించి
దావగొన కాయగంబనఁ దనరు నట్టి
వెన్నియో కన్నడపదంబు లున్నవన్న!

౧౦

దక్షిణాపరదిక్కుల - దాపునుంటఁ
దమిళ కర్ణాటపద వాయు - వమర వీచి
కొంత నెక్కొనె నీగతి - నంతకంటెఁ
గారణము వేఱె దీనికిఁ - గానరాదు.

౧౧

ఆనాటంగల శబ్ద శాసనము వేఱా? కానిచో నీ కృతిం
దే నక్షవీండె ఖలుండటంచు బహుధా - దీర్ఘంబుపైనున్న య
ర్థానుస్వారము పూర్ణబిందువుగఁ జేయంజాలె దీవింత కీ
నానాశబ్ద విచిత్రయోగములు నీనాడుండెనా రాట్కవీ!

౧౨

ఇది భాషా పరిణామ సూత్రమున కెంతే వింతగాదోఁప పె
ద్ద్యాదియుం బుట్టువుతోడనే సకల పూర్ణాసుందరూపముఁ బొం
దదు, కాని భవదీయ దైవమును బాధ్యాన్యంబుగాఁ జూపె దీ
వది నైజంబనరాదు లోకమున లోకాతీత వేదాంతికే.

౧౩

నన్నయవంటి గొప్పకవినాటికె భారతముల్ రచించియే
యున్నఁ ద్వదీయవందనము - నొప్పుగఁ గైకొనఁడొక్క దేవునిన్
సన్నుతిచేసి సద్గురుల సంస్కృత కావ్యకలాప కర్తలన్
మన్ననఁ జూచి యాంధ్రకవిమాన్యుని నొక్కనినైన నెంచరే?

౧౪

"సత్యముగఁ జేయు పరిశోధనముల వలన
నాఁడు తెలియని శాసనాల్ - నేఁడుతెలిసె
వానివలననె నిష్పక్షపాతబుద్ధి
నీవె పూర్వుఁడవనిచెప్పఁ దావుగలిగె"

౧౫

అని కొందరందు రత్తఱి
మన దేశచరిత్రవ్రాయు - మంగళ దృష్టిం
జనమొందమి నిజమిది యని
యనుకొనుటకు వీలుపడక - దయ్యె నృపాలా!

౧౬

పసివాఁడన్ నినుగూర్చి యిప్పగిది సంభాషించుటంగాంచి న
గ్గసితోఁజూడకు పక్షపాతముగఁ బల్కంజాల నట్లాడ సా
హసమా యైననుమాన నాత్మగత సత్యస్ఫూర్తి జాటించుచే
యసిధారావ్రత మైనఁగాని యది నా కానందమున్ గూర్చుతన్.

౧౭

కవిరాజ శిఖామణి యని
యవనిం బ్రఖ్యాత లెంక - యాదిత్యుం డీ
కవియని బిరుదము లలరెను
శివకవులం దాదికవిగఁ - జెప్పెద రాజా!

౧౮

చోడవంశపు టెకిమీఁద - సొగసుగాఁడ
కరుణ దొలుకాడఁ బ్రజలను - గాచువాఁడ
తెలుఁగుఁగైతకుఁ జెలికాఁడ - తెనుఁగుఱేఁడ
నన్నయకు సాటివాఁడ! ఓ నన్నెచోడ!

౧౯

నా వందనంబుఁ గైకొని
దీవింపుము కరుణతోడ ధీరా! యింకం
బోవలయు మనోవీధిని
సేవించుచు నాంధ్రకవుల - చిత్తము లలరన్.

# అజ్ఞాత గ్రంథ యుగము

౧

ఒక రొకదారితీయ నది యొప్పక రేగిన జైన బౌద్ధ వై
దిక మతఘర్షణంబనెడి తీవ్రనిదాఘ విదాహకీలల౯
గకవికలైన నాఁటి ఘన కావ్యరసాల విశాల సాలముల్
ప్రకటనసేయఁగాఁ దిరిగి భారతమాతకునైన శక్యమే?

౨

ధర యధర్వణు భారతం బెటువోయెను
గవి రాక్షసుని ద్వ్యర్థి కావ్యమేది?
తిప్పన్న వ్రాసిన గొప్ప పొత్తము లేవి
నారాయణు ప్రబంధ నామమెద్ది?
యమరేశ్వరకవి విక్రమసేన మెందేగె
వీరయాఖ్యు త్రిపుర విజయమెచట?
కాణ్వుని తెలుఁగు వ్యాకరణ మేమయ్యెను
సత్యాశ్రయుని గ్రంథ సమితికలదె

యెందఱెందఱు మహనీయు లెవ్వ రెట్టి
భవ్య రచనలుసల్పిరో వానిసంఖ్య
పదులొ వందలొ వేలొ చెప్పంగవశమె
కాలగర్భానఁ గలిసిన కారణమున.

# కవి బ్రహ్మ
# తిక్కన

౧

ఇదియె పినాకినీనది - మహీసురవర్యులు వేదమంత్రముల్
చదువుచు స్నానమాడి - రవి సత్కృపనొందఁగ భక్తి నర్ఘ్యముల్
వదలిరి,- వచ్చుచుండిరదె - వాకొనుచుండెను ధీరుఁడెవ్వఁడో-
సదయతఁ జోడివా రలర - సన్నపు టెల్గునఁ దెల్గువెల్గులన్.

౨

తిక్కన కవ్యగ్రిణులా
చక్కని భారతమువ్రాయు సత్పురుషులు - మీ
రెక్కాలమందుఁ గవులను
జుక్కలలోఁ జంద్రుపోలెఁ జూడంబడరే.

3

ఒకచేఁ గత్తియు - నొక్కచేఁ గలము - నెంతో ధైర్య ధీ శక్తులం
బ్రకటింపన్ ధరియింప - రాజ్య కవితారాజ్యంబులందాంధ్ర ల
క్ష్మి కటాక్షోత్పల పుష్పదామములు నీకే తోరణాలయ్యె, నీ
సకలజ్ఞత్వ పటు త్వతత్త్వములకున్ సర్వజ్ఞులున్ మెచ్చఁగా

౪

కొందఱు శబ్దమార్దవము,- కొందఱు పాకము,- శైలి కొందఱుం-
గొందఱు భావ సౌష్టవము,- కొందఱు మేల్ నుడికారపుం గళం -
గొందఱు ద్వ్యర్థి,- అర్థరతిఁ గొంద, అలంకృతులందుఁ గొందఱున్-
డెందము నిల్ప,- నిల్పుదువు నీ మది నన్నిటిపైనిఁ దిక్కనా!

౫

వ్యుత్పత్తి ప్రతిభాసమేతుఁడు, మహా వ్యాహక్రియాదక్షుఁ, డీ
హత్పుణ్యాత్ముఁడు, నిత్య భారత కథాహ్లాదుండు, సాచివ్య దీ
వ్య త్పద్మాంచిత దాన శోభుఁడు, కవిబ్రహ్మాంకుఁ,డైతిహ్య ధీ
సత్పుణ్యుండని నిన్ను నెన్నుదురు ప్రజ్ఞాసాంద్రులౌ సత్కవుల్.

౬

విడఁబడి కవ్వడి కడు వడిఁ
గుడి యెడమల బాణపంక్తి - గుప్పినరీతిన్
గడగడ విసరిన నీ నుడి
తడబడకది పద్యములుగఁ - దాండవమాడెన్.

౭

భారతకథా చమత్కృతి భాగ్యమరసి
వినినచో భారతంబునే వినవలయును
తినినను మినుపగారెలే తినవలెనని
పెద్ద లనుకొనుచుండుట విశదమెకద!

౮

పదునెనిమిది పర్వంబులఁ
బదిలపఱచినార లాంధ్రభాష విరివిగా
మృదుపద భూషణములచే
మది కానందంబు గల్గు మంజూషయనన్.

౯

అయ్యా! నిన్ దిగకంటి వేలుపనిరార్యానీక.- మౌనౌను; నీ
శయ్యల్ మాతృకకే మెఱుంగు లిడగా- సంక్షేప విక్షేప సా
హాయ్యమ్ముల్ వెలుగం-ద్రిమార్గముల మాహాత్మ్యంబుఁజూపించితే
వెయ్యార్లిచ్చిన వచ్చునే పరుల కీ విద్వత్కలా భాగ్యముల్.

౧౦

అరయ విరాటపర్వమున కందముఁ గూర్పఁదలంచి- మాతృకన్
సరిగఁ దెనుంగుసేఁత- యొకచట్టము గాదని- యింకముందు వే
వుర కిది మార్గదర్శి యవుఁబో యనఁ- గావ్యకలాపరూపముల్
విరివిగఁ జూపితీవు- సుకవీ కుకవీశుల కీనుపుట్టఁగాన్.

౧౧

నాల్గులో మూఁడు భాగముల్ తెల్గుపలుకు
లలరు చుండును- నీ కవిత్వామృతమున-
మాతృభాషాభివృద్ధి- నీ మతముగానఁ
దెనుఁగుకవి వన్న నీవయే- తిక్కయజ్వ!

౧౨

నీ రాయబారముల జిగి
నీ రణరంగముల నీతి- నీ ధర్మంబుల్
నీ రాజకీయ తంత్రము
నీ రాజులకెన్న నిత్య నీరాజనమౌ.

౧౩

అన్న! త్వదీయహస్తమున- నద్భుతలీలఁ గలావిచిత్రముల్
చెన్నుగ దిద్దుచున్నదది చెల్వగు గంటమ? కాదు. నీమనో
ఘ్యన్నతి- నొక్క చిత్రపటమోయన వ్రాసెడికుంచె,- కానిచోఁ
గన్నుల కంటఁగట్టినటు కన్పడునే భవదీయ దృశ్యముల్.

౧౪

ముద్దుగంటపుఁ జిఱుగజ్జె మ్రోగుచుండఁ
బలుకు పలుకునఁ బూఁదేనె లొలుకుచుండఁ
దెనుఁగు జాతీయతను దిద్ది తీర్చి తీవు
శుభగుణవిరాజి! తిక్కనసోమయాజి!

౧౫

ఒకపదము నెన్నివిధముల నొప్పుగాను
వాడవచ్చునొ యట్లన్ని వాడితీవు
పల్లెపిల్లల చిన్నారి పదములెన్నొ
యీ మహాకావ్యముననె క్రిక్కిరిసియుండు.

౧౬

వచనంబుగ దొర్లును - నీ
రచనం - బద్దానఁగల్గు రమ్యమదేమో
సుచరిత! నీ ప్రత్యేకత
రచనా వైదగ్ధ్యముననె రాణించెఁదగన్.

౧౭

ఆ కాలపుఁ బద్ధతులను
నా కాలపు నమ్మకంబు - లతి విపులముగా
వాకొంటివి శ్రీకరమని
నీ కైత సనాతనంపు నిష్ఠ వెలుంగన్.

౧౮

ఉత్తమ పురుష క్రియలన్
హత్తుకొను ద్రుతంబు - లోపమైనను సరియే
చిత్తమున నొండు తలఁపక
పొత్తంబునవ్రాసి తటులె - పురుషవరేణ్యా!

౧౯

అల సకారాంత తేజస్వి యను పదంబు
పాణినికి సమ్మతముగాని ప్రత్యయ మిడ
రూఢిగా నిందుఁ దేజిష్ఠ రూపమొకటి
కలదది నిజంబు ప్రామాదికమ్ము సుమ్ము!

౨౦

స్వల్ప దోషంబు లనఁదగు వాని నెన్ని
నిన్ను ననుకొన నేటికి- నన్నయకును
గలవు సాహసిక ప్రయోగములు కొన్ని
లెక్కలోనికి రావవి- తిక్కనార్య!

౨౧

వ్యాకరణంబె మూలమను భావముతోఁ బరికింప భాషలో
నే కవి కావ్యమందయిన నెంచఁగవచ్చును దప్పులైన న
నల్ఫాకట జుఱ్ఱుకోఁ దగినదౌ పరమాన్నముఁ దెచ్చిపెట్టఁగా
నే క్రియనైన వీడుదుమె యేలకి తోళ్ళోకకొన్ని గల్గినన్.



## ప్రబంధపరమేశ్వరుఁడు

# ఎఱ్ఱన

౧

నన్నయవలెఁ బ్రారంభము
తిన్నఁగఁ గావించి కవిత తిక్కన కయితం
జెన్నుగఁ గలిపిన నీనుడి
పున్నెము నెన్నంగ గొప్పబో యెఱ్ఱన్నా!

౨

కొద్ది యవకాశమునఁ గడుఁ బెద్దలాభ
మందితీవు కవిత్రయమందుఁ జేరి
బళిర! ముత్తెపుఁజిప్పలోఁ బడిన చినుకు
వెల గలుగు మంచి ముత్యమై వెలయు టరుదె?

3

దేవభాషాపదంబులు తెలుఁగు పదము
లొకటి కొక్కటి సమముగ నొగిదియుంట
హారమున రత్నములును ముత్యములు సరిగ
గ్రుచ్చినట్లుగ నీ శైలి నచ్చియుండు.

౪

భారతపుసృష్టి నన్నయబ్రహ్మ యనఁగఁ
బిదపఁ బోషించెఁ దిక్కన విష్ణువనఁగ
ఎఱ్ఱన సమాప్తి యొనరించె నీశుఁడనఁగ
పొలుపుగఁ ద్రిమూర్తు లిట్టులఁ బుట్టినారొ!

౫

కదలీపాకము నీదుశైలి- విలసద్గంభీర భావోన్నతుల్
పొదలన్ భాసురవర్ణనాత్మకముగాఁ బొల్పారు నీ ఘట్టముల్
హృదయాహ్లాదకరమ్ముగాఁ దనరు సాహిత్యంబు సాహిత్య సం
పదలందూఁగు భవత్కలాలలన దీవ్యద్ధర్మ సంబద్ధయై.

౬

'కేలు' నిత్యైకవచనమై క్రాలుచుండఁ
'గాళ్ళ'తో సరితూగఁగఁ గేళ్ళటంచు
వాడినావయ్య నీ హరివంశమందు
సాహసం బిదియని చెప్పఁ జాలునట్లు.

౭

'వెన్నాడు' శబ్దమునకున్
'వెన్న' దని ప్రయోగమొకటి వెలసెనొయేమో
'వెన్నడికొని' యను రూపం
బన్నా! యారణ్యపర్వమం దిరవొందెన్.

౮

నన్నయ తిక్కనాది కవినాథులకే గలవన్న నేరికిం
కెన్నఁగలేము దోషతతి నెప్పుడు వానినె చూడఁ దుమ్మెదల్
పన్నుగఁ దేనెకై వెదకు భంగిగ నుండక యీఁగ పుండుకై
క్రన్నన పాఱఁజూచినటు కన్పడుకేమి విచిత్రమారయన్.

౯

ఆంధ్రభారత రచనయన్- యజ్ఞమందు
నవభృథస్నానమీవెకా- యాచరించి
చెడని సత్కీర్తి నార్జన- చేసికొంటి
హితజనోచిత సత్కార్య! యెఱ్ఱనార్య!

౧౦

ప్రోలయ వేమారెడ్డియుఁ
జాలఁగ నిన్ గౌరవించి- శాశ్వతకీర్తి
శ్రీలలనాథవుఁ డయ్యెను
మేలబ్బదె బుధుల కింత- మేలొనరింపన్.

౧౧

డోలాబ్జనాథమౌళిని
వాలాయము పూజసల్పు- వాఁడవగుటచే
శీలము గల్గుట పాపము
ప్రీలంగా శంభుదాస- బిరుదం బొప్పెన్.

నవీనగుణ సనాథుఁడు

# నాచన సోమనాథుఁడు

౧

తొలకరి మెఱుపుల తోటలోఁ దిరుగాడు
నీ మనశ్చాతకి నేర్పునేర్పు
నింద్రధనుస్సునకేని వన్నెలు గూర్చు
నీ భావశబలత నిగ్గుజగ్గు
దివిజగానవినోదదీక్ష దుంపెసలాడు
నీ కవిత్వలతాంగి నిల్పుపాల్పు
ద్యోనదీహంసల ధ్వనికి ముద్దులుదిద్దు
నీ కావ్యగీర్ధ్వని నీటుమాటు

తలఁచి కాఁబోలు నిన్ను విత్రయముకంటె
గొప్పగాఁ జెప్పికొనిరయ్య కొందఱింక
నగ్గికంటిని దాఁచిన హరుఁడ వంద్రు
సుకవిజనవర్య! నాచన సోమనార్య!

౨

ఉత్తర హరివంశము లో
కోత్తరకావ్యం బటంచు నుత్తములు కడుం
జిత్తముల నలరుదురు పురు
షోత్తము గుణలీల ముద్దులొల్కెడి శతనఁ.

3

తెలుఁగు నుడికారమును దీర్చిదిద్దుటందుఁ
దిక్కనకు నుద్దివీవంట నిక్కమెకద!
పలుపలుకులేల? నిన్ను సర్వజ్ఞుడంచు
జగతి గణుతించె నీకైత సాక్షిగాఁగ.

౪

శ్రుతిహితపద బంధమ్ముగ
శ్రుతిసమ్మత ధర్మసూక్తి - శోభితరీతిన్.
గృతిఁ గూర్చితి వద్భుతముగ
నతులివియె నవీనగుణస-నాథుఁడ వగుటన్.



# మహాకవి పోతన

౧

అది పూజాగృహ మందుఁ బోతన మహాహ్లాదంబుతో రామునిన్
హృదయాబ్జంబున నిల్పి భక్తిమెయిఁ బూజించెం గలా స్రష్టయై
యెదియో వ్రాసి సగంబు, తోఁపకిఁకఁ బోయెందావుఁదప్పించి యం
దదిగో రాముఁడు పూర్తిచేసెడిని పద్యం బాతఁడే పోతనై.

౨

భక్తుల కోరికఁ దీర్పఁగ
శక్తుండయి యుండు రామచంద్రుం డనుచున్
యుక్తిన్ వాకొనుటకు నిది
శక్తిసుమీ యాస్తికత్వ శక్తి వెలుంగన్.

3

భక్తుఁడవు నీవు నిజముగ
శక్తుండవు దైవశక్తి సాధింపంగా
ముక్తిని బడయం గోరుచు
నక్తంచరవైరి నెపుడు నమ్మితివి కవీ!

౪

అవలోకించితివయ్యా
భువనజన మనోభిరాము పుణ్యవిరామున్
ప్రవిమల తేజోద్ధామున్
శివకరగుణ దివ్యధాము శ్రీరఘురామున్.

౫

జాతానందము తోడఁ
ఖ్యాతిగఁ గనుఁగొంటివయ్య కల్మషరహితుఁ
సీతాలక్ష్మణ సహితుఁ
రాత్రించరహతవినీతు రఘుకులజాతుఁ.

౬

ఎట్టి కథయైన సద్భావ ముట్టిపడఁగ
నతిశయోక్తులు లేకున్న నందమగునె?
ఎఱిఁగి నవరత్నములను స్థాపింపకున్న
మేల్మినగయైనఁ దళతళ మెఱయునొక్కొ?

౭

రాముఁడు భక్తకిల్బిషవిరాముఁడు నిర్మల నీల నీరద
శ్యాముఁడు దుష్టదానవమహారణభీముఁడు సత్యభాక్పరం
ధాముఁడు శిష్టపోషణ సుధామయనాముఁడు జానకీమనః
కాముఁడు సత్కవిత్వము జగంబునఁ బెంపానరింపకుండునే?

౮

ఇహము కంటెను బరము జయింపఁ దలఁచి
భావమునకంటె భక్తిపై భ్రాంతినిలిపి
వ్యంగమునకన్న వాచ్యము నందుఁ బ్రేమ
నధికముగఁ జూపుచుండెడి బుధుఁడ వీవు.

౯

ముద్దులు మూటగట్టు నవమోహన దివ్యకలా కలాపమే
దిద్ది సువర్ణకావ్య సుదతీప్రతిమ౯ సృజియించి జీవము౯
బెద్దగఁబోసి యేమి మఱిఁబెట్టితొ ముచ్చటగా ధ్వనించు నీ
పద్దెములన్నిటం జెఱకుపానక మూరుచునుండు పోతనా!

౧౦

గున్నమామిడి చిగురులఁ గూర్మి మెక్కి
కూయు కోకిల మధురార్ద్ర కూజితములు
హంసనడకలు నెమిలి నృత్యంపు సొంపుఁ
గరము నేర్చెను నీ కావ్యకన్య సుకవి!

౧౧

వ్రాసితివి భాగవతమును
గోసితివి సమస్త పాపకుజ పుంజములన్
డాసితివి విష్ణుపదమును
నీ సములెవరయ్య నిత్యనిర్మల చరితా!

౧౨

పాత్రంబులు వినఁ, బుణ్య
క్షేత్రంబులు, హరిఁ గనంగఁ గేవలమంత
ర్నేత్రంబు లమృతదాయక
స్తోత్రంబులు పరమవిష్ణు చారిత్రంబుల్-

౧౩

పులియుఁ మేఁకయునొక్క రేవుననె త్రావున్నీరు పెన్పాము పి
ల్లలఁగాచుం బురివిప్పినెమ్మి; హరిణిఁ లాలించుసింహంబు; భూ
తలమే స్వర్గమ బ్రహ్మపట్టణమ యేతన్మౌని పుణ్యాశ్రమ
స్థలమాహాత్మ్య మదేమొకో ప్రకృతిదృశ్యంబిందు మార్పొందెడిఁ.

౧౪

అడుగుటయే తలంపని మహాగుణశాలి సుశీలి పోతనే
యడిగిన నెట్టిభోగములనైన నొసంగఁడె రాముఁడేమొకో
యడుగడు నశ్యదృశ్యముల నచ్చపు విష్ణుపథైకలోలురై
యడుగఁగనేర్తురే పరమహంసలు మోక్షముదక్క అన్యముఁ.

౧౫

కలలోఁగాంచిన వస్తుసంఘములు నిక్కంబంచు భావించునే
తెలివింజెందిన మీఁద నాత్మరతిచేఁ దేజంబు దర్శించి తా
నల విజ్ఞానకళాప్రబోధమున మాయానిద్ర మేల్కాంచి యే
ఫలమాసించి యిహంబుఁ గోరు నరుఁడా పద్మాక్షు సేవించుచుఁ

౧౬

ఒక కంట నీరుఁ గార్చుచు
నొక కంటను నిప్పుకణము లొలుకఁగఁ గొడుకుం
బ్రకట హరిభక్తి మాన్పఁగఁ
గకవికలౌ నా హిరణ్యకశిపుం డకటా!

౧౮

ఏరా డింభక! విష్ణువిందుఁ గలఁడే యీ స్తంభమందుండెనే
రారా చూపుమటంచు దాని గదతో రక్షోవిభుండేయఁగా
ఘోరాకారముతో నృసింహమయి భక్తుంబ్రోవ వేంచేయు నా
నీరేజాక్షుని దివ్యశక్తి జగముల్ నిండెం గళాలోలతన్.

౧౯

వల దీ దానమటంచు శుక్రుఁడు మహావాత్సల్యముం జూపుచున్
బలుకం బల్కఁక మాఱదంచు హరికిం బాదంబులం గడ్గి ని
శ్చలుఁడై సర్వము ధారవోయుటకునై సంసిద్ధుఁడైయున్న యా
బలినిన్ దత్సతి ఘోరదానబలి సంభావింపఁగాఁ జెల్లదే?

౨౦

పతి శీర్షంబున వామనుండు పదముం బ్రాపింపఁగా భర్తతో
గతియే సద్గతియంచు వే బలిని బిగ్గంబట్టి నాథా! శ్రియః
పతి ద్రొక్కంగఁ జలింపఁ బోకుఁడనుచుం బాతాళముంజేరు త
త్సతి వింధ్యావళికీర్తి యిజ్జగతి నా - చంద్రార్కమై వెల్గదే?

౨౧

భర్తతోడిద లోకమన్ పద్ధతిఁ గని
వర్లతోడను దట్టెండ వలదె చెప్పుమ?
దీన నేదేశమును బొందలేని ఘనత
భారతాంబకుఁ గల్గుట భావ్యమె కద!

౨౧

ధ్రువవిజయము భక్తమనో
ధ్రువవిజయము పరమకళల ధ్రువవిజయంబై
భవసాగరంబు దాటఁగ
శివకరమగు నావపోలెఁ జెలఁగును సుకవీ!

౨౨

వయసునఁ జిన్నవాఁడు గుణవంతుఁడు మా ధ్రువుఁడంచుఁ దల్లియున్
భయరహితుండు విష్ణుపదభక్తుఁడు మా ధ్రువుఁడంచుఁ దండ్రియున్
రయమునఁ గౌగిటం దనిపి రాజ్యమొసంగుచునున్న దృశ్యమున్
జయము మనోంబకంబుఁ గని సంతసమందును లోకమెప్పుడున్.

౨౩

ఎప్పుడు నిశ్చలుండగుచు నీశ్వరుఁ గూర్చి తపంబు సేయునో
యప్పుడు నాత్మఁ బొందుఁ బరమాద్భుత దివ్యపదంబు కాని, వాఁ
డప్పల నెట్టి లోపముల నందక తత్పదమందు నిల్చుచోఁ
బువ్వులఁ బూజ సేయుదురు పూజ్యులు పూజ్యుఁడటంచు నిచ్చలున్.

౨౪

హరిభక్తుని చరితంబును
బరమానందంబుతోడ వ్రాయుచు శుభలీ
ల రసపిపాస న్నివే
హరి భక్తునియందు లీనమగుచుందువయా!

౨౫

చిత్రకారుఁడు చిత్రించు చిత్రమునను
గాయకుఁడు గానమునఁ గవి కవితయందుఁ
జక్కఁగా లీనమయి యద్దిజరుపు కతన
సృష్టికింకేదొ ప్రతిసృష్టి చెలఁగు టరుదె?

౨౬

బాణకథాఘట్టంబున
స్థాణుని చతురంగబలము సంగరకేళిం
బ్రాణ భయంబున నిలువక
కాణంబులరీతిఁ బాఱ కారణమేమో!

౨౭

లయకారుఁడు హరుఁడు కదా
లయకారుని గెల్చునట్టి లయకరుఁడున్నౌ
భయరహితమైన మృత్యుం
జయ శబ్దము శివున కెట్లు సమకూడె నయా!

౨౮

జ్వాలను గంటం దాల్చెను
కాలుని నొక క్షణములోన గాల్చె నిలువునౌ
హాలాహలమును మ్రింగెను
శూలిని-హరి గెల్చెననుట చోద్యము సుకవీ!

౨౯

ఇంతకు భస్ముని గర్వం
బంతయు నణఁచుటకుఁ బన్నిరయ్యా యిటులే
యింతియుకా హరిహరులే
పంతమునఁ దాక జగము భస్మము కాదే?

౩౦

ఆ మహాకావ్యమున దోష మింతయున్న
నెంచ రసలక్షణంబుగా నెట్టులనిన
షోడశకళాప్రపూర్ణుఁడౌ సోమునందు
నల్పముగఁ గానఁబడియెడి నల్పుపోలె.

౩౧

చేపట్టఁ బురుగుల నోటఁ
బారక శిథిలంబులైన భాగములెల్లన్
నారయ గంగన సింగన
పూరించిరి భాగవతము పుణ్యంబనుచున్.

౩౨

భోగినీ దండకంబున భుక్తి నరసి
భాగవతమున శ్రీరామభక్తిఁ దగిలి
వీరభద్రుని విజయాన విమలముక్తిఁ
బొందఁ గలిగితివయ్యా! యో పోతనార్య!

33

కవులు దరిద్రులా? నిజమె కారణమా? ధనకాంక్షలేక యా
శివకరమైన కావ్యరససిద్ధికి నిత్యము ప్రాఁకులాడుటం
భువిపయిఁ బొట్టకూటికిని బుట్టదు దానికి గేలియేల? స
త్కవిత మహత్తెఱింగిన జగంబున రాజులు పూజసేయరే?

3४

హాలికుఁడవంచు నిన్ను హాస్యాస్పదముగ
మాటలాడిన మీ బావ బాటతప్పి
హాలికుని క్రింది హాలికుఁ డయ్యె నకట!
ఈశ్వరునిలీలఁ దెలియఁగా నెవరి తరము?

3౫

కలము హలము నొక్క కరమున నడిపింప
చలము బలము నీక సాధ్యమయ్యె
కలిమిలేము లొక్క కంటితోఁ జూచెడి
శాంతమూర్తుల కిది సహజమె కద!

3౬

అనఘా! నీ కైతకు నే
మనమున సంతోషమంది మాన్యుఁడ వనుచున్
వినయమున మ్రొక్కి సెలవుం
గొనిపోయెద నొండు కవిని గూరిచి వ్రాయన్.